# విజ్ఞా





ఆంధ్రమహాజనులారా!

నేననంతపురమండలములోని హిందూపురం తాలూకునఁగల కల్లూరువాస్తవ్యుఁడను. చిన్నతనముననే కవిత్వమునలవడి, యష్టాదశవర్షవయస్కుఁడనగుటకుముందె యీ క్రిందిగ్రంథముల విరచించితిని. కాని జనధనసాహాయ్యంబులు లేమిఁజేసి—(1) సత్యలీలాలహరి (ప్రబంధము). (2) కృష్ణార్జునీయము (నాటకము). (3) అన్నపూర్ణవాహిని. ప్రథమభాగము. (4) ద్వితీయభాగము (నవల). (5) పద్యావళి మఱియు వైదర్భీవిలాసము (మంజరీద్విపదగీతములు). (6) ప్రభాతము, లేక, హిందూదేశచరిత్రరత్నాకరము, ప్రథమపాదము—యను గ్రంథములన్నియు ముద్రణముఁగానక నిలిచిపోయినది. అయినను కొందఱు ప్రముఖులు ద్రవ్యసాహాయ్యము చేయ సమ్మతించినకతంబున, వానిని త్వరలోఁ బ్రకటింపఁదలంచినాఁడ. ఈయాంధ్రవాఙ్మయము సులభము గాకున్నను, భాషాభిమానులనుగ్రహించి దత్తమండలముల సారస్వతపోషణము తక్కువయను లోచనీయాంశమును కొంతవఱకైనఁ దీర్పనెంచి పోషకులయ్యెదరను ధైర్యము వహించుచున్నాను. పాఠకులు చందాదారులై, చందాధనము ప్రోగుచేసి, భాషాసేవచేయుదురుగాక. పోషకులకు రు 25-0-0. చందాదారులకు రు 3-8-0 మాత్రమే.

ఇతరులకు రు 6-0-0. ఆంధ్రశ్రీకార్యమునకుఁ దోడ్పడుటకై పారింపఁ బ్రార్థితులు.

ఈపద్యత్రిదశకము నాటకవితగా మున్ను రచించియుండి మాద్రికిగాను, రా॥ శ్రీ॥ సద్దికూటి తిమ్మారెడ్డిగారి సాయమున నిప్పుడు ప్రకటించితిని. రసికులిందలిగుణంబుల గ్రహించి, దోసంగులుండిన తెల్పుదురని కోరుచున్నాఁడ.

అత్మకూరు,
ది 10-8-1920.

ఇట్లు,
కల్లూరు యజమాన వెంకటనారాయణ
రావు, బి. ఎ. విద్యార్థి.




శ్రీసత్యపర...నమః

# శ్రీకృష్ణ...ము

క॥ శ్రీరమ్యగుణనిశాంతుఁడు
పారావారస్థ నాగవల్లభతల్పుం
డారాధ్యుండిదెదుర్గ వం
దారుజనావనసమాఖ్యుఁదనర్గ శుభముల్.

ఉ॥ శ్రీరజతాద్రి సర్వసుర
సేవితుఁడై చెలువొందునాథు నం
భోరుహసన్నిభంబయిన
మోమును వేడ్కఁ దదర్ధదేహనీ
హారనగాత్మజాత, కని
యంచితహాసము సేయఁజూచినం,
తేరహిసర్థమున్ గనని
తీరున నవ్వగజాస్యుఁ గొల్చెదన్. 2

చ॥ సురుచిరహాసచంద్రికకు
సొంపున సలయుమిచక్రివాకులె
ల్లరు సుఖయుక్తులై మనఁగ
లక్ష్మియురస్థలిలోరహింప సా
దరహృదయ ప్రవృత్తికిని
ధానమునంగనెవంగు చక్రిహో

యరగొ ల్లలుద్భవింపనటు
లారసిప్రోచుత నిచ్చనిచ్చలన్. 3

శా॥ చింతింతున్ మదభీష్టసిద్ధికయి రా
జీవా_ప్తకన్యాపగా
శ్రాంతోర్విన్ వ్రజసుందరీయుతుఁడవై
కాంతాంబుజాతద్వయ
శ్రాంతపద్రస్తరవేదికన్ వెలయు నీ
కల్యాణరూపంబు మ
త్స్వాంతాగారమునందు సంతతము కృ
ష్ణా! భక్తసంరక్షకా! 4

శా॥ సంగీతంబును సాహితీత్వము బృహ
త్త్సౌర్యంబున్ సన్నుతా
సంగాకారవిలాసమున్ సుకవితా
జ్ఞానంబు విశ్రాణనం
బుం గాంగేయనగస్థిరత్వమును సం
భూతంబు లుత్ప_త్తితో
నింగన్ శీతసమీరుఁడుట్టుపగిది
స్త్రీస్త్రాత్మసంరక్షకా! 5

శా॥ పారావారపరీతభూతలలస
త్పుణ్యస్థానషట్కంబు నీ

హారాహార్యనివాస సంభృతధు నీ
హార్ద్రాివగాహంబులున్
శ్రీరామాంఘ్రి సమర్చనాశతములున్
జెల్వొంది తూగంగలే
వౌరా! మాతృనమస్సమానముగ కృ
ష్ణా! భక్తసంరక్షకా! 6
మ॥ ఘనవన్యాటనమాజసాఖ్యదము గో
కల్యాణ సంపాదకం
బున వాకారమునేలకిచ్చుజిలుగుల్
బుట్టంబు సర్వత్రసా
ధ్వని కాంతోజ్వలశాద్వలస్థలమునే
దన్, మూదిలేపుల్గొనన్
జనునే మానవరాజకిన్ జగతిఁ గృ
ష్ణా! భక్తసంరక్షకా! 7
మ॥ శివుఁడో కేశవుఁడో యధీశ్వరుఁడుగన్
జిత్తాంబుజావాసిగా
గ, వనంబందునవో పురంబునవో, సా
ఖ్యాకాంక్షుఁడా మానవుం
డు, వసింపన్ దగు, సార్వభౌముఁడో యతీం
దుంద్రుడో సుమిత్రుండు కా

నవతారుణ్యశుభాంగిభార్యగ ననూ
నదివ్యభాగ్యాభవా
ర్ణవమగ్నుండయి భాసిలన్వలెను గీ
ర్వాణావలీ రక్షణా! 8

మ॥ మహిలో మానవులెంత తీవ్రపడి సం
రంభంబునన్ దోర్బలం
బహముల్ రేతిరియున్ రచించియును నా
హా! పొందగానేరరా
వహనీయంబుల లంఘ్యముల్, హరిరమా
పద్మాక్షిఁ బెండ్లాడెమా
డహరుండుష్ణహలాహలంబుఁ గుడిచె
న్దాక్షిణ్యతన్ ధైర్యధూ
ర్వహులౌ కార్యవులబ్ధిఁదెచ్చునెడఁ గీ
ర్వాణావలీ రక్షణా! 9

మ॥ అరయన్ సాహితిలేనిమానవుఁడు మా
తాపేతుఁడౌ డింభకుం
డు రణోద్ధత్యముఁ బాసినట్టి నృపుఁడున్
దుర్వృత్తినాథాప్తిలే
కరహిన్ బొల్చునిపాత్రియున్ నిరతముల్
గమ్రిత్రమాదూరుఁడౌ

వరవిద్వన్నిధిలెక్కకెక్కిరిల నా
పన్నావలీ రక్షణా! 10

శా॥ మాపుణ్ రేపుగడింది శ్రీద్ధజన స
మ్మాన్యుల్ ఋషీశుంర్మదిణ్
బ్రోవుణ్ దాపును నీవయంచుఁ దలఁచణ్
భద్రావళుల్గల్గెనాఁ
బాపల్బెప్పగవిందు వారలిలలోఁ
బాపిష్ఠిదారిద్ర్యతా
కూపంబందు తపింతురెందులకు? ర
క్షోవైరి సంరక్షణా! 11

మ॥ స్వనివేశంబునఁ బూజమూర్ఖుఁడుగొనుణ్,
స్వగ్రామమందప్రభుం
డనయంబున్నతినొందు, గౌరవమునం
దన్నేర్చుభూనేత స్వా
వని, విద్యాలసితుండు కీర్తిఁగను న
వ్యానంత నశాంతమున్,
వినుతింపణ్ దగుసత్కళావిదుల నె
వ్వేళణ్ మహీరక్షణా! 12

మ॥ ధరపై నైజగుణాళులెట్టివను తా
త్పర్యంబులేకణ్ జను

ల్పరులన్ హేళనసేయుచుందురు నిజ
ప్రారబ్ధముం దల్పరే
వ్వరు, నాపన్నకలాపముం నవుదురే
బ్భంగిన్ స్వనీలప్రభన్
గురిగింజ ల్దెలియంగ నేరనటు ర
క్షోవైరి సంరక్షణా! 13

మ॥ సుగుణోద్భాసితయా కళత్రమును వం
శోద్ధారుఁడౌ పుత్రుఁడున్
నగరాజేంద్రసుతాధవస్మరణయున్
నానాకళాజ్ఞత్వమున్
ఖగమంత్రిప్రతిభావిశేషమును రా
కాచంద్రసౌభాగ్యమున్
జగతిన్ గోరియుఁగావు సాధ్యములు కృ
ష్ణా! భక్తసంరక్షణా! 14

శా॥ ఉద్యచ్చండమయూఖసన్నిభులు ప్రి
త్యుత్పన్నధీసంయుతుల్
సద్యోధ్వస్తసమస్తకిల్బిషతతుల్
సద్భాసుపర్వాల్ఘనా
విద్యావిష్టమనఃప్రదీపకరులై
వ్వేళన్ విజృంభించిన

హృద్యంబై నెగడుం జగత్త్రయము శ్రీ
కృష్ణా! సుధీరక్షణా! 15

మ॥ ధరణిం సంపదలెల్ల సర్వసుఖసం
ధానక్రియాభవ్యముల్
కరముం గూర్తుమటంచుఁ జేర్తురుజను
లాకామ్యార్థసంసిద్ధికై
నిరతోదీర్ణముదావహంబయిన సం
దీప్తాచ్ఛకైవల్యమే
నరుఁడుం గోరఁడిదేమిచోద్యమొకో! కృ
ష్ణా! భక్తసంరక్షణా! 16

మ॥ నియతిగ్రామణులైన సంయములు హృ
న్నీరప్రసూతస్థితా
వ్యయులై ఖ్యాతిఁగడించియుం జగతిమా
హాకృష్టమానాత్ములై
నయముం వీడిరిగాదెముం మనుజుల
జ్ఞానుల్భవన్మాయని
ర్భయులై నిన్నడరం దలంపరు నిలిం
పవ్రాతసంరక్షణా! 17

మ॥ దినముం మానవులొండొరుం గని మదో
ద్రిక్తాత్ములై క్షేమమే

యని ప్రశ్నింతురు హంసపాత్రిక్ష్మఖరిపై
నావిర్భవంబంది వే
గనపాథోధిమునింగి యాయువునిలన్
గాత్రర్యంబునన్ దస్కరిం
పనరస్తోమపుసేమ మెక్కడిది? ధ
ర్మామ్నాయసంరక్షణా! 18

మ॥ ఉపకారంబునొనర్పరాదిల నభీ
క్ష్ణోద్యన్నికృష్టాత్మమా
నపవిత్రాధ్వచరిష్ణుసంతతికి, స
ర్పానీకముల్ పాలుతో
డపవర్తింపయుఁ బెంచియున్ విషమునే
లా వీడవీయుర్విఁ? భూ
మిపవంశాంబుధి శీతభాస్కర! రమా
మిత్రా! సుధీరక్షణా! 19

శా॥ సంతృప్తిన్ గననట్టి విప్రవరుఁడ
శ్రాంతంబు సంతోషిత
స్వాంతుండై నవనీధవుండు నిలలో
సాంద్రశ్రీపాపేతయౌ
కాంతారత్నము, హీప్రపూరితసువ్యా
ప్తంబాతయౌ వేశ్యయున్

చింతఁ జెంది విపన్నమగ్నులగుదుర్
శిష్టపరిజారక్షణా! 20

శా॥ ప్రాముఖ్యంబునుఁ గన్నవారియెడ న
ల్పంబైనదోషంబు చా
లఁ మాలిన్యముఁ దెచ్చు నల్పులయెడన్
లావైన దుష్కీర్తి యీ
భూమిన్ వన్నెకులోటు తేదరయఁగాఁ
బూతంపు క్షీరంబునన్
గోమూత్రింబుకణంబుచాలు చెఱుపన్
గోసార్థసంరక్షణా! 21

మ॥ అవనిన్ స్వశ్వశురాలయంబులు నిజం
బత్యంతసంతోషసం
భవసంస్థానములై చెలంగువారియే
మానంయుతుంఙ్గాచు భూ
రివనస్థానశయానుఁడై మొ సఁగుగో
రిన్ గూడి వెల్గున్ స్వయం
భవుఁడాహార్యశిఖావిటంకమున సా
మానోత్కరంబందులన్
నివసింపంగఁ దలంచుటబ్రిమొకో! మా
నిస్తోమసంరక్షణా!

మ॥ విషమైపోల్చెదు నభ్యసింపనియెడన్
విద్యావిశేషంబు బ
ల్కృపి లేకున్న, దరిద్రమానవునకున్
కీర్త్యుజ్వలద్గోష్ఠులే
విషరూపంబువహించు, వృద్ధునకు నీ
విశ్వంబునన్ గాంతయే
విషమెవ్వేళనసాధ్యమైనవిషమీ
పృథ్విన్ సుధీరక్షకా! 23

మ॥ అలఘుప్రోజ్వలదాశుగాశనశిఖా
గ్రాలంబిరత్నద్యుతిన్
బాలుపాఱన్ గని డగ్గఱన్ జనునె? సు
ప్తున్ నత్వరామూధేనునిన్
మలయన్ శక్యమె? విద్యదాఢ్యుఁడని దు
ర్మానిన్ నమీపింపఁగా
కలుగన్ బోదుసుఖంబు నిక్కమిది భ
క్తవ్రాతసంరక్షకా! 24

మ॥ అలఘూర్తుల్వనరుద్ధలోపముఖుల్
స్వాభీష్టసిద్ధ్యర్థజా
తలనచ్ఛందన శీతలప్రథిత వా
గ్ధారేయులుద్యత్ప్రధా

నలకీలాలికళంకితాత్ములుగనన్
నవ్యోదయద్గాఢధీ
కలితుల్వీరలె మంచివారలట భ
క్తవ్రాతసంరక్షణా ! 25

శా॥ గర్వంబంది సతీసుతాదికము సా
ఖ్యంబంచువాటించి యా
నిర్వాణంబుఁదలంపరెవ్వఁడు నరు
ల్నిక్కంబు వర్తించు నీ
యుర్వీన్ సర్వముఁ బ్రాగ్భవప్రభవమై
యొప్పారు సుజ్ఞానమున్
నేర్వన్ జాలుదురే బ్రియత్నములని మా
నివారిత సంరక్షణా! 26

మ॥ అనయంబున్ గుజనప్రమర్దనము సా
ఖ్యప్రాప్తికిన్ మూలమై
ట్లన భేరుల్కడుదుష్టసైంధవము స్వ
ర్ణంబున్ మహామాధురీ
జనకంబైన పదిక్షుఖండచయమున్
చక్కంబడున్ ఘుట్టనం
బున, శిక్షల్గుణవృద్ధిదంబులుకదే !
పుణ్యప్రజత్రాణనా ! 27

మ॥ వరగంగాయమునానదీసికతభూ
భాగంబునం దిందుశే
ఖరహృత్ప్రీతిదమైనవృత్తి వ్రజరా
కాచంద్రబింబాననో
త్కర సంవేష్టితరాసహేలఁ జలుపన్
గైవల్యమున్వీక్షణన్
సురభుల్పొందె నిరున్ నుతింపఁదరమే
సుత్రామసంరక్షణా! 28

సీ॥ శ్రీనాథ పాదాబ్జ♦చింతనానిరతి వి
జ్ఞానసామ్రాజ్యాధి♦నాథుఁడగుచు,
సాంద్రయశశ్శ్రీని♦సద్దికూటిశుభాన్వ
యామరాధ్వమునకు♦హంసయగుచు,
వెంకటార్యకళత్ర♦విఖ్యాతపాపమ
గర్భశుక్తిసుమౌక్తి♦కంబనఁదగు
యాచకానీకబృ♦హద్వాంఛలోనఁగూర్చి
యుచ్చకీర్త్యాచ్ఛాదితాశుఁడగుచు
గీ॥ ప్రబలి యీగ్రంథముద్రణ♦పరత నెనఁగె
నెవ్వఁడట్టి "తిమ్మారెడ్డి"♦కింపుగాఁగ
ననుపమానయశోదప్రి♦యాయువులిడి
కరుణఁ బ్రోచుత నిచ్చలు♦నరుని సఖుఁడు. 29

మ॥ అలవాసిష్ఠసగోత్రుఁడన్ వడుగు నా
డాఖ్యాన్వయుండేను ని
స్తులకల్లూర్యజమానపట్టవిలసత్
సుబ్రాయపుత్రుండ రా
జిలుదన్ వెంకటనారయాభిధ సుధీ
చింత్యంబుగాగన్మదిన్
లలినూహించి రచించితిన్నియనుఁ గ
ల్పస్థాయులౌ గావుతన్. 30

శా॥ శ్రీకాంతాకుచభాక్పటీరవిలసత్ ♦
శృంగారవక్షుండు, మో
హాకాంతాచరితోజ్జ్వలజ్జపవిశి ♦
ష్టాచారసంపూర్ణసు
శ్లోకానీకశుభప్రదుండెపుడుఁ గా ♦
రుణ్యామ్నాతంబుట్టు వీ
హాకాదంబినిఁ బేర్చుఁగాత సుమన ♦
స్సోస్సర్వభఃక్పంక్తిపై. 31

ఓం తత్ సత్.



# లఘుటిప్పణి.

1. నిశాంతుఁడు=ఉనికిపట్టయినవాఁడు.
2. గణపతి శైశవదశ వర్ణింపఁబడినది. నీహార=మంచు.
4. రాజీవాప్తకన్యాపగ=యమునానది. కాంత=మనోహర, ప్రస్తర=రాలు.
5. పుట్టు=జనిమ. విశ్రాణనము=దాతృత్వము.
6. ప్రస్థాన=యాత్ర. అహార్య=పర్వత. ధునీ=నది.
7. శాద్వలము=పచ్చిక. ఏదన్=మానగా.
8. ద్రవ్యభాక్ప్రాభవ=ధనముచేపొందిన వైభవము.
9. రచించిరయా=ప్రదర్శించియును. కాశ్యపులు = దేవతలు.
10. రహిఁబొల్చని=మానముగామనని.
12 నవ్యావంతి=క్రొత్తదేశములో.
13. అపన్నకలాపము=విపత్తునొందినవారిగుంపు.
14. నగరా...నుతాధవ=శంకరుఁడు. ఖగ=దేవ.
15. ప్రత్యుత్పన్నధీ=సమయస్ఫూర్తి.
18. హంస=సూర్యుఁడు. ప్రాక్శిఖరి=తొలిగట్టు.
19. అభివర్ధిష్ణోద్యత్=మాటిమాటికిని పెరుగుచున్న. అపవిత్రాధ్వ=చెడ్డమార్గమున. చరిష్ణుఁ=తిరుగ వాంఛించువాఁడు.
20. త్రపా=హ్రీ=సిగ్గు. అతీత=లేనిది. సుహృత్=మంచి.

21. పూతంపు = స్వచ్ఛమైన.

22. పిటంకము = మేడ. వన = నీళ్ళు, స్వయంభవుఁడు = శంకరుఁడు (చూ. శివపురాణము.)

24. అశుగాశన = పాము. అలంచి = వ్రేలాడుచున్న. సత్వయూథేశ్వర్ = సింగము.

25. వనరుట్ = కమలము. కీల = మంట.

26. ప్రాగ్భవపరిధనమై = తొలిజన్మపుఫలమై.

27. త్రాణనా = రక్షకా.

28. సుత్రామ = ఇంద్రుఁడు. సుగభులు = ఆప్తులు.

29. ఆర్యా = కృషీవలుఁడు. శుక్తి = ముత్యపుచిప్ప. అనీక = గుంపు.

30 వటుకనామాఖ్యాన్వయుండు = బడగవాడను పేరిటి కొలమువాఁడు.

31. కాదంబిని = మేఘమాల. సుమనస్ = దేవతలు, మంచి మనస్సుగలవారు. సర్పభుక్కు = నెమలి. రూపకాలంకారము.

---

Sree Savitri Press, Cocanada.